# శ్రీవేంకటేశ్వరస్వామి వారి
# పూజా విధానము

(తిరుమలక్షేత్ర సంప్రదాయ అనుసరితం)


రచయిత

**శ్రీమాన్ అర్చకం రామకృష్ణ దీక్షితులు**

అనువంశిక అర్చకులు,

తిరుమల తిరుపతి దేవస్థానములు






ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2017**

# SRI VENKATESWARA SWAMY VARI POOJA VIDHANAMU

(TIRUMALA KSHETRA SAMPRADAYA ANUSARITHAM)

***By***
Sriman  Archakam Ramakrishna Deekshitulu

T.T.D. Religious Publications Series No. 1227


*First  Print : 2017*

*Copies :* 500

*Published by*
**Sri ANIL KUMAR SINGHAL** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati  Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
**Tirumala Tirupati Devasthanams Press,**
Tirupati - 517 507

## ముందుమాట

**వేంకటేశా త్పరోదేవో నాస్త్యన్యః శరణం భువి**
**వేంకటేశ సమో దేవో నాస్తి నాస్తి మహీతలే**

ఈ భూమిమీద శ్రీవేంకటేశ్వరస్వామివారిని మించిన పరదైవం ఇతరత్రా లేడు. ఉండడు. అలాగే శరణువేడటానికి ఆ స్వామివారికి సాటిరాగల దేవుడు ఈ భూమండలంలోనే లేడు. లేనే లేడు.

“నేను వైకుంఠాన్నయినా విడిచి వుండగలనుగాని నా భక్తులకు ఒక్క క్షణమైనా వదలివుండలేను” అన్న దృఢమైనదీక్షతో వేంకటాచలక్షేత్రంలో కొలువైవున్న అద్భుతమైన దేవుడు శ్రీవేంకటేశ్వరుడు.

ఎప్పుడో ఏనాడో వక్షఃస్థల శ్రీమహాలక్ష్మీ సమేతంగా శ్రీవైకుంఠంనుండి భువికి దిగివచ్చి అద్భుతమైన సాలగ్రామశిలామూర్తిగా స్వయంవ్యక్తమై అర్చమూర్తిగా ఆవిర్భవించిన ఆనందనిలయునికి ప్రతి నిత్యం వైఖానసాగమ శాస్త్రోక్తం ప్రకారంగా షట్కాలార్చనలు నిర్వహింపబడుతున్నాయి.

ఆ తిరుమల దివ్యక్షేత్రంలో నిత్యం శ్రీనివాసభగవానునికి జరిగే నిత్యార్చనల మాదిరిగానే ఎవరికి వారు, వారి వారి గృహాలలో శ్రీవేంకటేశ్వరస్వామివారిని అర్చించి ఆరాధించుటకుగాను, **“శ్రీవేంకటేశ్వరస్వామివారి పూజావిధానం”** అనే చిన్న పుస్తకాన్ని రూపకల్పన చేసి అందించాలని దేవస్థానం సంకల్పించింది. అందుకనుగుణంగా తిరుమలలో మాదిరిగానే, శ్రీనివాసభగవానుని అర్చించే విధానాన్ని చిన్ని పుస్తకంగా అందించిన రచయిత శ్రీమాన్ అర్చకం రామకృష్ణదీక్షితులు. వీరు తిరుమల శ్రీవారిని పరంపరానుగతంగా, అర్చించే ఆనువంశిక అర్చకవరేణ్యులు. శ్రీస్వామివారిని సంప్రదాయపద్ధతిలో అర్చించడానికి వీలుగా ఈ రచయిత చక్కగా ఈ పుస్తకాన్ని రూపొందించారు.

శ్రీ స్వామివారిని ఆరాధించే నవవిధ భక్తి మార్గాల్లో "అర్చనం" అత్యంత సులువైంది. ఆచరణీయమైంది కూడ.

అందువల్ల తి.తి.దేవస్థానం అందిస్తున్న శ్రీనివాసభగవానుని అర్చనావిధానాన్ని సంప్రదాయబద్ధంగా తెలియచేస్తున్న ఈ చిన్న పుస్తకాన్ని భక్తులందరు అందుకొని సద్వినియోగం చేసుకోగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో....*

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.



# శ్రీవేంకటేశ్వరస్వామి వారి పూజా విధానము

**(తిరుమలక్షేత్ర సంప్రదాయ అనుసరితం)**

**అవతారిక**

**నిరుపమ గుణసిన్ధుర్నిత్యలక్ష్మీ సమేతో ।**
**నిఖిల నిగమవేద్యో నిస్తులో వేంకటేశః ॥**
**నిజచరణ సమర్చాసక్త భక్తౌఘరక్షీ ।**
**నివసతు హృదయే మే స్వాంఘ్రిభక్తిన్వితన్వన్ ॥**

'వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి ॥' అని వామనపురాణ వచనం. దీనిని సార్థకం చేస్తూ, తిరుమల దివ్యక్షేత్రంలో శ్రీవేంకటేశ్వరస్వామి వారు స్వయంవ్యక్తంగా అర్చావతార రూపంలో కొలువై, భక్త జనుల ప్రార్థనలను ఆలకించి, సంతోషించి వారందరినీ అనుగ్రహిస్తున్నారు. శ్రీవేంకటేశ్వరస్వామి వారితో సమమైన దైవం భూత, భవిష్యత్ కాలములలో మరొకరు ఉండరనేది శాశ్వతమైన సత్యం.

తిరుమల శ్రీవారికి, అత్యంత ప్రాచీనకాలం నుండి, వేద ప్రోక్తమైన శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర విధిగా నిత్యోత్సవ, నైమిత్తికోత్సవ, కాలోత్సవాదులన్నీ వైభవోపేతంగా నిర్వహింపబడుతూ వున్నాయి. సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు అంశగా, ఈ భూమండలంలో, నైమిశారణ్యం నందు అవతరించిన భగవాన్ విఖనస మహర్షి, ప్రవచించినదే ఈ వైఖానస భగవచ్ఛాస్త్రం. సమస్త వేదరాశిని, విఖనసులవారు ధ్యానించి, వారి శిష్యులైన భృగు, అత్రి, మరీచి, కశ్యపులకు, ప్రథమంగా ఈ వైఖానస ఆగమాన్ని బోధించారు.

కలియుగానికి అధిపతిగా, ఆశ్రిత భక్తజనవత్సలుడైన శ్రీవేంకటేశ్వరస్వామివారిని, దర్శించి, పూజించి, శ్రీవారి పాదపద్మములలో పరిపూర్ణ శరణాగతి చేసిన భక్తులందరికీ, తప్పక స్వామివారి అపార కరుణా కటాక్ష వీక్షణములు కలుగుతాయి. ధర్మం ఒక్కపాదం మీదే నడిచే ఈ

కలియుగంలో, శ్రీవేంకటేశ్వరస్వామివారిని పూజించడమే పరమధర్మం. శ్రీవారిని పూజించడం వలన కలిదోషాలు, మనలను బాధించక, సమస్త శుభాలు కలుగుతాయి.

**మానవుని అత్యున్నత లక్ష్యం**

ప్రతి మానవుడు జీవితంలో చేరుకోవలసిన అత్యున్నత లక్ష్యం గురించి భీష్మాచార్యులవారు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలో వివరిస్తారు. భీష్ముడు అంపశయ్య మీద ఉండగా, ధర్మరాజు అడిగిన అన్ని ప్రశ్నలకు, భీష్ములవారు సమాధానమిస్తారు.

**కిమేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణం ।**
**స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాః శుభం ॥**
**కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః ।**
**కిం జపన్ ముచ్యతే జంతుర్జన్మసంసార బంధనాత్ ॥**

అన్న ఈ శ్లోకంలో ధర్మరాజు, భీష్ములవారిని 6 ప్రశ్నలు అడుగుతాడు. ఈ 6 ప్రశ్నలకు ఇచ్చిన సమాధానంలో భీష్ముడు మానవ జీవితం యొక్క లక్ష్యాన్ని చక్కగా వివరించాడు.

1. ఈ సృష్టిలో ఒకే ఒక్క పరమదైవం ఎవరు?
2. మానవుని జీవితం యొక్క అత్యున్నత లక్ష్యం ఏమిటి?
3. ఏ దేవుని స్తుతించటం వలన మానవులకు శుభములు లభిస్తాయి?
4. ఏ దేవుని అర్చించుట (పూజించుట) వలన మానవులకు శుభములు కలుగుతాయి?
5. సర్వధర్మములలోకెల్ల ఉత్కృష్టమైన ధర్మమేది?
6. ఏ దేవుని నిరంతర ధ్యానము వలన, నామస్మరణ వలన జన్మ సంసార బంధనముల నుండి ముక్తి లభిస్తుంది ?



ధర్మరాజు అడిగిన ఈ ప్రశ్నలకు భీష్ముల వారు చక్కటి సమాధానమిచ్చారు.

ఈ జగత్తుకు ప్రభువు, దేవదేవుడు, అనంతుడు, పురుషోత్తముడు శ్రీమహావిష్ణువు (శ్రీవేంకటేశ్వరుడు). ఆ భగవంతుని నామములను భక్తితో, ప్రపత్తితో స్తుతిచేయుట వలన, పరిపూర్ణ శరణాగతితో అర్చన చేయుటవలన, ప్రసన్నమైన మనస్సుతో ధ్యానించుటవలన, ప్రణామము చేయుటవలన, మానవులు సమస్త దుఃఖాల నుండి విముక్తి పొందవచ్చును. ఆ పుండరీకాక్షుని పూజించుటయే ఉత్తమోత్తమమైన ధర్మము. సకల సృష్టి-స్థితి-లయ కారకుడు, పరమ మంగళ ప్రదుడు ఐన ఆ దేవదేవుని నిత్యం శ్రద్ధాభక్తులతో పూజించటంవలన, ఈ భూలోకమున జీవించు సమయమునందు సంసారబాధలు, దుఃఖములు తొలగి, భగవంతుని అనుగ్రహంతో మానవ జీవితం యొక్క అత్యున్నత లక్ష్యమైన మోక్షమును (విష్ణువు యొక్క పరమపదము-శ్రీవైకుంఠం) పొందుటకు మార్గము ఏర్పడుతుందని భీష్ములవారు వివరించినారు.

కనుక ఈ కలియుగంలో శ్రీవేంకటేశ్వరస్వామి వారిని నిత్యం పూజించటంవలన, భక్తజనులందరికి సమస్త దుఃఖాలు నివారణమై, మోక్షప్రాప్తి తప్పక కలుగుతుంది. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

మానవుని జీవిత అత్యున్నత లక్ష్యం, దేవదేవుడైన శ్రీమహావిష్ణువుని పూజించి, ధ్యానించి, నామస్మరణ చేసి మోక్షాన్ని పొందటం అని పైన తెలుసుకున్నాము. మరి ఏ విధానాన్ని ఆచరిస్తే సులభంగా, అత్యుత్తమ ఫలితములను పొందవచ్చు? ఈ ప్రశ్నకు తిరుమలలో కొలువైన కోనేటిరాయడే ప్రత్యక్షంగా సమాధానమిస్తున్నాడు. తిరుమల ఆలయంలో శ్రీవారికి అనాదిగా వైఖానసాగమం అనుసరించి ఆరాధన జరుగుతున్నది. ఈ ఆరాధనతో సంతుష్టుడై, ప్రసన్నుడైన శ్రీవేంకటేశ్వరస్వామి, భక్తుల కష్టాలను తొలగించి, వారు కోరిన కోరికలను తీర్చి వారికి పరమానందాన్ని,

కేవలం దర్శనమాత్రం చేతనే, అతి సులభంగా అనుగ్రహిస్తున్నారు. అందుచేతనే కోట్లాది మంది, ప్రపంచ వ్యాప్తంగా, జాతి, కుల, మతములకు అతీతంగా తిరుమల క్షేత్రాన్ని సందర్శించి శ్రీవారిని సేవించి, స్వామివారి పరిపూర్ణ అనుగ్రహాన్ని పొందుతున్నారు. ఇదియే ప్రత్యక్ష తార్కాణం. కేవలం దర్శన మాత్రం చేత శ్రీ శ్రీనివాస ప్రభువు భక్తుల కష్టాలను తొలగించి వారికి సకల శుభాలను కటాక్షిస్తున్నారు.

**భగవంతుని ఆరాధన**

ఇప్పటివరకూ దేవతలలో పరమదైవం ఎవరు, ఎవరిని పూజిస్తే మానవ జీవిత అత్యున్నత లక్ష్యమైన మోక్షప్రాప్తి కలుగుతుందో తెలుసుకున్నాం. ఇక ఆ భగవంతుని ఏ విధమైన ఆరాధనా పద్ధతిలో పూజిస్తే సులభంగా ఫలితాలు కలుగుతాయో తెలుసుకుందాం.

భారతీయ సనాతన ధర్మమునకు, అపౌరుషేయాలైన వేదములే మూలములు. పరబ్రహ్మయొక్క నిశ్వాస రూపాలే వేదములు అని బృహదారణ్యకోపనిషత్తు చెబుతున్నది. భగవంతుని అనుగ్రహం వలన, ఈ వేదాలు, దివ్యజ్ఞాన సంపన్నులైన మహర్షుల దర్శనానికి అంది లోకంలో ఆవిష్కరించబడ్డాయి. ఈ వేదములు మొదటగా ఋగ్వేదంతో ప్రారంభమయి, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదంగా విస్తరించింది. లోక కళ్యాణాన్ని కలిగించే ఎన్నో భావనలు, త్యాగనిరతిని పెంచే ఎన్నో ప్రక్రియలు, అణువణువునా భగవంతుని స్వరూపాన్ని భావన చేయించే మంచి ఉపదేశాలు, సమసమాజాన్ని నిర్మించుకోవడానికి కావలసిన ఎన్నో సమన్వయాలు, పురుషార్థాలను సంపాదించుకోవడానికి ఎన్నో భౌతికాభౌతికోపాయాలు వంటి విషయాలెన్నో నాలుగు వేదములలో చెప్పబడ్డాయి.

ఇటువంటి మహత్తరమైన వేదరాశి మూలంగా ఆవిష్కరింపబడి, శ్రీవిఖనసుల వారిచే అనుగ్రహించబడిన వైఖానసాగమం, సర్వత్రా



ఆచరణీయము. శ్రీవేంకటేశ్వరస్వామి వారికి అత్యంత భక్తి శ్రద్ధలతో వైఖానసాగమ విధానమును అనుసరించి, ప్రాచీనకాలం నుండి కూడా, అన్ని కైంకర్యాలు విశేషంగా నిర్వహింపబడుతూ ఉన్నాయి. ఈ విశిష్ట కైంకర్యాలకు సంతుష్టులైన శ్రీవారు, పరమానందంతో ఆనందనిలయంలో కొలువై, భక్తులందరికీ వరప్రసాదిగా పూజలందుకుంటున్నారు.

నవవిధ భక్తి మార్గాలైన శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం భగవంతుడైన విష్ణువుకి ప్రీతికరమైనవిగా చెప్పబడ్డాయి. ఇందులో 5వ విధానమే అర్చనం. పరబ్రహ్మను నిత్యం, వేదములో చెప్పబడిన శ్రేష్ఠమైన విధానంలో అర్చన చేయటం. అత్యంత ఫలవంతమైనదిగా తలంచబడింది. ఆధ్యాత్మిక సాధనలో అతి ముఖ్యమైన మనస్సు, వాక్కు, కర్మ (మనోవాక్కాయకర్మ, మనసావాచాకర్మణా), ఈ అర్చనా విధానములో మాత్రమే ఆ పరమాత్మ యొక్క కైంకర్యంలో తరించడానికి వీలుపడుతుంది

**కర్మణా మనసా వాచా ఏతావజ్జన్మ-సాఫల్యం**
**దేహినాం ఇహదేహిషు కర్మణా మనసా వాచా**
**శ్రేయ-ఆచరణం సదా**

దీనినే త్రికరణ శుద్ధి అని కూడా అంటారు. మనం చేసే కర్మలన్నింటిలో ఈ మూడు కరణములలో ఏదో ఒకటి వుంటుంది. ఈ మూడు కరణములతో చేసే మంచి పనులు ఏవైనా, విశేషమైన శుభ ఫలితాలను ఇస్తాయని సనాతన ధర్మజ్ఞులమతము. ఇక్కడ 'మనసా' అంటే మన యొక్క మనస్సు ద్వార చేసే ఆలోచనలను తెలియజేస్తుంది. ఇక 'వాచా' అంటే మన నోటి నుండి వచ్చే 'మాటలు' కాగా, 'కర్మణా' మనం చేసే పనులను సూచిస్తుంది. పైన చెప్పబడిన నవ విధ భక్తి మార్గములలో, 5వ దైన 'అర్చనా' విధానంలో మాత్రమే ఈ మనస్సు, వాక్కు, కర్మలనే త్రికరణములు పాల్గొంటాయి.

వేదాలను అనుసరించి ఏ మానవుడైతే, మనోవాక్కాయ కర్మలచే భగవంతుని త్రికరణ శుద్ధిగా ఆరాధిస్తాడో, అతనికి తప్పక మహత్తరమైన శుభ ఫలితములు కలుగుతాయని మహర్షులు పేర్కొన్నారు. అర్చనా విధానంలో, విగ్రహ రూపంలో ఉన్న విష్ణు భగవానుడిని మనం ఆరాధన చేస్తాము. ఈ ఆరాధనలో మనం మనస్సును, స్వామివారి రూపము నందు లగ్నం చేసి, 'వాక్కు' ద్వార వేదమంత్రాలను పఠిస్తూ, 'కర్మ' ద్వార శ్రీవారికి వివిధ ఉపచారములైన అర్ఘ్యపాద్యాదులను సమర్పిస్తాము. ఇలా మన 'త్రికరణములు' – మనస్సు, వాక్కు, కర్మ, భగవంతుని సేవలో నిమగ్నమవటం వలన, మనం చేసే ఆరాధన, అర్చన తప్పక భగవంతునికి, ప్రీతి కలిగించి, ఆయన అపారమైన కరుణా కటాక్ష వీక్షణములను, మనమీద ప్రసరించి, మనం సంపూర్ణంగా అనుగ్రహింపబడుతాము.

కనుక కలియుగంలో, చంచలమైన మనస్సు కల్గిన, మానవులకు, అత్యంత కరుణతో, సులభసాధ్యంగా ఐహికాముష్మిక ఫలాలు పొందటం అనేది అర్చనా విధానం ద్వార మాత్రమే సాధ్యమవుతుంది. 'ఐహిక' అంటే ఈ ప్రపంచంలో మానవ రూపంలో జీవించి ఉన్నంతవరకు, మనకు ఆనందాన్ని కలిగించే భౌతికపరమైనటువంటి సుఖాలు. ఇక 'ఆముష్మిక' అంటే మనం ఈ మానవ శరీరాన్ని చాలించిన తర్వాత, ఆ పరమాత్మను చేరుకొనే మార్గం. ఈ రెండు కూడా మనకు అవసరమే. ఎందుకంటే కేవలం ఐహిక ఫలితాలు మాత్రమే పొందితే, మనం చేసిన పాప, పుణ్యాలను అనుసరించి తిరిగి మరొక దేహంలోకి ఆత్మ ప్రవేశించి, ఈ భూలోకంలో కర్మను అనుభవించాలి. మనం ప్రవేశించే దేహం మానవ రూపం కావచ్చు, లేక పశుపక్ష్యాదులు, క్రిమి కీటకాదులు కావచ్చు. ఇలా ఏదైన మన కర్మను అనుసరించే లభిస్తుంది.

కానీ శాశ్వతమైన ఆనందం, ఆత్మ పరమాత్మలో ఐక్యం అయిన తర్వాతనే లభిస్తుంది. దీనినే మహర్షులు మోక్షం అన్నారు. "ఆముష్మిక" ఫలసాధనే మన చివరి లక్ష్యం. ఇలా రెండు విధములుగా, ఐహిక ఆముష్మిక ఫలితాలను,



సులభసాధ్యంగా పొందగలిగే విధానమే శ్రేష్ఠమైనదని చెప్పవచ్చును. మనం చేరవలసిన గమ్యం, మనం ప్రయాణించే మార్గాన్ని అనుసరించి వుంటుంది. కాబట్ట మనం ప్రయాణించే మార్గం, ఎప్పట్టికైనా గమ్యం చేరుతుంది అని తెలిస్తే, మనం రెట్టించిన ఉత్సాహంతో ప్రయాణం చేయవచ్చు. పై విషయాలు తెలుసుకోవాలంటే, మనకున్న ప్రామాణికమైన, అత్యుత్తమమైన మార్గం వేదములు, మహర్షుల గ్రంథాలు, పురాణాలు.

మహోన్నతమైన వేదరాశిని ఆధారంగా చేసుకొని, అనేక మంది గొప్ప మహర్షులు, వారు స్వయంగా ఆచరించి, అనుభవించి ఫలితాలు పొందిన అనేక మార్గములు మనకు ఉపదేశించారు. ఇందులో అత్యంత కష్టసాధ్యమైన మార్గాలు (అష్టాంగ యోగం) మొదలు సులభసాధ్యమైన మార్గాలు (విగ్రహారాధన) వరకు ఉన్నాయి. ఏ మార్గాన్ని ఆశ్రయించాలి అన్నది ఆయా యుగాలలో, మానవుని స్థితప్రజ్ఞత మీద, ఆధారపడి వుంటుంది.

కర్మభూమియైన భారతదేశంలో ఎందరో గొప్ప మహర్షులు, మోక్షం పొందిన మహానుభావులు, వేదాంతాన్ని, భాష్యాలతో విపులీకరించిన ఆచార్యులు, పరమాచార్యులు జన్మించారు. వీరందరూ కూడా ఎన్నో జన్మలలో సత్కార్య ఆచరణ, మోక్షసాధన, భగవంతుని ఆరాధన శ్రద్ధగా చేసి, చివరికి మోక్షాన్ని పొందారు. కానీ ఈ కలియుగంలో కఠోరమైన నియమాలతో కూడి వున్న పద్ధతులు, ఆచరణ పరంగా కష్టసాధ్యమైనవి. ఇక్కడ మనకు ఉపదేశించబడిన అన్నీ మార్గాలు, మోక్షసాధనకు అత్యున్నతమైనవే, అందులో ఎటువంటి సందేహం లేదు. కానీ యుగధర్మాన్ననుసరించి.

**కృతేతు మానసం శ్రేష్ఠం త్రేతాయాం యజనం పరమ్ ।**
**ద్వాపరే ప్రతిమార్చా చ కలౌ చింతన ముత్తమమ్ ॥**
**చతుష్వపి యుగేష్వేవం విశేషస్తు యుగేయుగే ।**
**మంత్రోచ్చార క్రియాద్రవ్య ధ్యాన భావాంగ పంచకమ్ ॥**

**(మరీచి ఆనందసంహిత)**

కృతయుగమునందు మానస పూజ శ్రేష్ఠమైనది. కేవలం ధ్యానమాత్రం చేత పరమాత్మ ప్రత్యక్షమై అనుగ్రహిస్తాడు. అలాగే త్రేతాయుగంలో యజ్ఞకార్యములు విశిష్టమైనది. ద్వాపర యుగమందు విగ్రహార్చన, కలియుగ మందు చింతన (నామస్మరణ) ఉత్తమమైనదిగా శ్రీవైఖానస గ్రంథం, మరీచి ఆనంద సంహిత పేర్కొన్నది. ఇట్లా ప్రతి యుగమునందు భగవత్సాక్షాత్కార విధానంలో ఈ భేదాలు ఉన్నప్పటికీ, ఈ నాలుగు యుగాలలో సమానంగా మంత్రోచ్చారణ–క్రియా–ద్రవ్యం–ధ్యానం–భావం అనే అంగపంచకం సమానంగా ఉంటుంది. ఇక్కడ అర్చనా విధానం ద్వాపర యుగం నాటిదని చెప్పబడింది. అయితే మనం ఎంతో పుణ్యం చేసి వుండటం వలన, భగవంతుని అపారకరుణ వలన, మనం కలియుగంలో వున్నప్పటికీ, ద్వాపరయుగం నాటి విగ్రహారాధనకు ప్రతీకమైన ఆలయాలను మనం దర్శిస్తూ, భగవంతుని విగ్రహరూపంలో సేవించి తరిస్తున్నాము. ఎందుకంటే కలియుగం మొత్తం 4,32,000 సంవత్సరములుగా చెప్పబడింది. ఒక్కొక పాదమునకు 1,08,000 సంవత్సరాల చొప్పున, 4 పాదములు 4×1,08,000= 4,32,000 సం॥లు. శ్రీ కృష్ణభగవానుడి అవతార సమాప్తితో కలియుగం ప్రారంభమై, నేటికి సుమారు 5115 సం॥లు గడిచినది. అంటే మనం ఇంకా కలియుగ ప్రథమపాదంలో, ప్రారంభంలోనే వున్నాము. అందుచేతనే మనమింకా ద్వాపరయుగం నాటి ఆలయార్చనా విధానమును చూడగల్గుతున్నాము.

మహావిష్ణువు భక్తులను అనుగ్రహించడానికై పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా అనే పంచ విధ స్వరూపాలుగా ఆవిష్కృతుడవుతాడు. ఈ ఐదు రూపములలో ఒక్క అర్చారూపి అయిన విష్ణుభగవానుడు, నమస్కారం, పూజ, మంత్రములతో, ఆదరంతో పరమపదమును (మోక్షాన్ని) సులభంగా, శీఘ్రంగా అనుగ్రహిస్తాడు. అర్చారూపం యొక్క సౌలభ్యం వర్ణించటానికి నాకున్న శక్తి చాలదని వేదవేత్తయైన మరీచి మహర్షి ఆనంద సంహితలో తెలియజేస్తాడు.



'అర్చా' రూపం అంటే శిలా, దారు, లోహములతో తయారైన విగ్రహరూపంలో ఉన్న పరమాత్మ అని అర్థం. మరి ఇప్పుడొక సందేహం కలుగవచ్చు. జీవం లేని విగ్రహారూపంలో పరమాత్మ ఏ విధంగా ప్రవేశిస్తాడు అని. మరీచి మహర్షి, శ్రీవైఖానస ఆనంద సంహిత–విమానార్చనాకల్పంలో, ఈ సందేహానికి చక్కటి వివరణ ఇచ్చారు.

**"సర్వాధారం సనాతన మప్రమేయ మచింత్యం నిర్గుణం నిష్కలం క్షీరే సర్పిః, తిలే తైలం, పుష్పే గంధం, ఫలే రసం, కాష్ఠే అగ్నిమివ సర్వవ్యాపినం పరమాత్మానాం మనసా సంకల్ప్య ఆవాహయేత్ ॥"** (శ్రీవైఖానస మరీచి విమానార్చనాకల్పం–31వ పటలం)

సర్వాధారుడు, సనాతనుడు, అప్రమేయుడు, అచింత్యుడు, నిర్గుణుడు, నిష్కలుడు అయిన పరమాత్మ – పాలలో నేయివలె, నువ్వులలో నూనెవలె, పుష్పాలలో తేనెవలె, పండ్లలో రసంవలె, కట్టెలలో అగ్నివలె సర్వవ్యాపిగా వుంటాడు. అట్టి భగవంతుని, మనస్సులో భక్తి ప్రపత్తులతో సంకల్పించి, ఆవాహనం చేయాలి. ఏ విధంగా అయితే కట్టెలలో, మంటలను గాలి ద్వార జ్వలింపజేయవచ్చో, అదే విధంగా సర్వవ్యాపి అయిన విష్ణువు, ధ్యాన మథనంవలన, భక్తి ప్రపత్తులవలన, సంకల్పబలంవలన విగ్రహంలో ప్రవేశించి, మన పూజలందుకుని మనలను అనుగ్రహిస్తాడు. చక్కటి రూపంతో, విగ్రహ రూపంలో ఉన్న విష్ణుభగవానుని ఆరాధించి, సాధన చేస్తూ ఉంటే, మోక్షసాధన మార్గంలో మనం సరియైన మార్గంలో ప్రయాణిస్తున్నట్లే దీని వలన కొంత కాలానికి, మనకు కేవలం ధ్యానంలోనే పరమాత్మ గోచరిస్తాడు.

ఈ ఉత్కృష్టమైన, శ్రేష్ఠమైన ఆరాధనా విధానమే (వైఖానసాగమము), తిరుమల దివ్యక్షేత్రంలోని శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో, అత్యంత ప్రాచీనకాలం నుండి ఆచరింపబడుతూ, వాటి యొక్క ఫలాలను నేటికి, ఇక ముందు కూడా, కేవలం దర్శన మాత్రం చేతనే, మనమందరం

పొందగల్గుతున్నాము. సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడు, మునులలో ప్రథముడు అయిన భగవాన్ విఖనస మహర్షుల వారిచే, ఈ లోకానికి అనుగ్రహింపబడినదే, 'శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రం'. దక్షిణ భారతదేశంలోని అనేక వైష్ణవ దివ్యక్షేత్రముల యందు నేటికీ వైఖానస ఆరాధనా విధానం అవలంబించబడుతూ, కేవలం దర్శన మాత్రం వలన అనేక మంది భక్తులు స్వామి వారి కృపకు పాత్రులవుతున్నారు.

ఇప్పటి వరకు మనం మానవ జీవిత అత్యున్నత లక్ష్యం, జగత్తులో పరమదైవం ఎవరు, ఆ దైవాన్ని ఏ రూపంలో, ఏ ఆరాధనా విధానంలో పూజించాలో తెలుసుకున్నాము. ఇక తరువాతి అంశం, ఈ పూజ ఏ విధంగా చేయాలో తెలుసుకుందాం.

## శ్రీ వేంకటేశ్వర పూజా విధానము

తిరుమల దివ్యక్షేత్రంలో స్వయంవ్యక్తంగా, సాలగ్రామ అర్చా రూపంలో అవతరించి, భక్త సులభుడుగా కీర్తింపబడే పరమదైవం శ్రీవేంకటేశ్వరస్వామివారు, సాక్షాత్తూ శ్రీవైకుంఠంలోని శ్రీమన్నారాయణుడే. శ్రీవారి లీలలు, అవతరణ, మహిమలు మరియు ఇతర వైభవాల గురించి మనకు ద్వాదశ పురాణాంతర్గత శ్రీ వేంకటాచలమాహాత్యమ్ అనే సంకలనం సవివరంగా తెలియజేస్తోంది.

మనం సంప్రదాయం ప్రకారం జరుపుకునే పండుగలు, వ్రతాలు వంటివి వినాయకచవితి, వరలక్ష్మీ వ్రతము ఇవన్నీ కూడా పురాణాలలో చెప్పబడి, (ఋషులు, దేవతల సంవాద రూపంలో), వారి వారి ఆచారముల మేరకు, ఈ వ్రతములన్నీ కూడా మనం చక్కగా నిర్వహించుకుంటాము. మనం సనాతన ధర్మంలో ఏ పూజ, ఏ వ్రతం, ఏ దైవాన్ని ఆరాధించాలనే విషయంలో కొన్ని తప్పనిసరి నియమాలు ఉన్నాయి. ప్రధానంగా మనం ఏ పూజ చేయాలన్నా, అది వేదంలో చెప్పబడి ఉండాలి లేక పురాణాలలో



చెప్పబడి ఉండాలి. ఈ రెండింటిలో చెప్పబడని విషయాలను, పద్ధతులను పూజలను ఆచరించుట, సత్ఫలితాలను ఇవ్వదని సనాతన ధర్మజ్ఞుల మతము.

ఇక శ్రీవేంకటేశ్వరస్వామివారి పూజా విధానం గురించి పరిశీలిస్తే, శ్రీవేంకటాచల మహాత్యమ్‌లో అనేక చోట్ల శ్రీవారిని స్తుతి చేస్తూ, స్తోత్రాలు, అష్టోత్తర నామావళి, సహస్ర నామావళి రూపంలో కనిపిస్తాయి. మనకు శ్రీవారిని గురించి తెలిపే ప్రామాణిక ఆధారం శ్రీవేంకటాచల మాహాత్యం మాత్రమే. కానీ ఇందులో ఎక్కడ కూడా శ్రీవారిని, వారి వారి స్వగృహాలలో, స్వయంగా శ్రీవారి నిత్యపూజ చేసుకోవటానికి సంబంధించిన ప్రస్తావన లేదు. కొన్ని ప్రచురణలు శ్రీవేంకటేశ్వర పూజా విధానం పేరుతో లభ్యమవుతున్నప్పటికీ, వాటి ప్రామాణికత శంకించదగిన పరిస్థితి ఉంది. మనం చేసే పూజ సత్ఫలితాలను ఇవ్వాలంటే, అది సరైన మార్గంలో, వేద ప్రామాణికంగా అనుష్టించే విధానంగా ఉండాలి.

అత్యంత ప్రాచీన కాలం నుండి కూడా తిరుమల ఆలయంలోని శ్రీవేంకటేశ్వరస్వామివారికి, వేదప్రోక్తమైన వైఖానస పూజ విధానం ప్రకారం ఆరాధనలు జరుగుతున్నాయి. ఈ పూజల వలన సంతృప్తి చెంది, శ్రీవారు, భక్తుల కోరికలను తీర్చే కొంగుబంగారంగా ప్రసిద్ధి చెందాడు. కనుక ఏదైతే, కొన్ని వేల సంవత్సరాల నుండి తిరుమల శ్రీవారి ఆలయంలో, క్రమం తప్పకుండా ఆచరింపబడుతూ, మనకు అత్యున్నత ఫలితాలను ఇస్తున్నదో, ఈ పూజా విధానమే మనం గృహాలలో చేయాలనుకొనే శ్రీవారి నిత్యపూజలకు కూడా విధిగా అనుష్ఠించాలి. ఎందుకంటే శ్రీవారికి సంబంధించిన ఒక ప్రత్యేకమైన గృహ పూజా విధానం, శ్రీవేంకటాచల మాహాత్యంలో మరెక్కడా చెప్పబడలేదు. అందువల్ల శ్రీవారి కేంద్రస్థానమైన తిరుమలలో, నిత్యం 365 రోజులు ఆచరింపబడే, శ్రీవైఖానస పూజా విధానం ప్రకారం, (సంక్షిప్తంగా) ప్రతి భక్తుడు, తమ స్వగృహంలో ఆచరిస్తూ, శ్రీవారికి నిత్య పూజలు చేయటం వలన స్వామివారి ఆశీస్సులతో పాటుగా ధర్మార్థకామ్య మోక్షాలు చక్కగా నెరవేరుతాయి.

**నిత్యం గృహే దేవాయతనేవా భక్త్యా భగవన్తం నారాయణ మర్చయేత్ ।**
**తద్విష్ణోః పరమం పదం గచ్ఛతీతి విజ్ఞాయతే ఇతి శృతిః ॥**
**(శ్రీవైఖానస కల్పసూత్రమ్-భగవాన్ విఖనస మహర్షి)**

భగవాన్ విఖనస మహర్షుల వారు, శ్రీమన్నారాయణుని ఆనతి మేరకు లోక కళ్యాణార్థం, మహత్తరమైనటువంటి అర్చావిధానమును అనుగ్రహించి నారు. నిత్యం గృహమునందు (పూజాగదిలో), దేవాలయమునందు భగవంతుడైన నారాయణుని భక్తులందరు, వేద విహితంగా అర్చన చేయాలి. ఎవరైతే ఈ విధమైన ఆరాధన చేస్తారో, వారు దేవతలకు కూడా దుర్లభమైన పరమపదం (శ్రీవైకుంఠం) చేరుకుంటారని శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రంలో పేర్కొనబడినది.

ఇటువంటి మహత్తరమైన విధానంలో పూజ ఎప్పుడు చేయాలి. అన్న విషయం శాస్త్రాలలో వివరించబడి ఉంది. ఆ పూజలకు, అర్చనలకు, ఉపాసనలకు, 'సంధ్య' సమయం పరమశ్రేష్ఠమైనదిగా నిర్ణయించబడినది. ఇక్కడ 'సంధ్య' అంటే 'సంధి కాలం' అని అర్థం. త్రి సంధ్యోపాసన అత్యంత ఫలదాయకమైనది. ఇవి 3 రకాలు

1. ప్రాతః సంధ్య, 2. మధ్యాహ్న సంధ్య, 3. సాయం సంధ్య.

1. ప్రాతః సంధ్య- ఇది మరలా 3 విధాలు. (అ) ఉత్తమం (బ్రాహ్మీ ముహూర్తం), (ఆ) మధ్యమం (తారక రహితం), (ఇ) అధమం (సూర్యోదయం అనంతరం - అంటే సూర్యోదయానికి ముందు ఘడియల సమయంలో)

2. మధ్యాహ్న సంధ్య- మిట్ట మధ్యాహ్నానికి 1½ ఘడియల ముందు 1½ ఘడియల తర్వాత.

3. సాయం సంధ్య- (అ) ఉత్తమం- సూర్యాస్తమయానికి 3 ఘడియల ముందు; (ఆ) మధ్యమం- సూర్యస్తమయకాలం, (ఇ) అధమం- నక్షత్రాలు కనిపించిన తరువాత.



అన్ని సంధ్యలలో 'బ్రాహ్మీముహూర్త' కాలమే ప్రశస్తమైనది. బ్రాహ్మీ ముహూర్తమంటే తెల్లవారుఝామున 3:30 గంటల నుండి 4:45 గంటల మధ్య సమయంగా చెప్పవచ్చు. ఈ సమయంలో ప్రకృతి సత్త్వగుణం స్వభావాన్ని కలిగి ఉంటుంది. నిశ్శబ్దమైన, కల్మష రహితమైన వాతావరణం, ప్రశాంతత మనస్సుకు కొత్త శక్తిని కలిగిస్తుంది. అందుకే ఈ సమయం అన్ని రకాల పూజా, ధ్యాన, జప, తపాదులకు అనుకూలమని చెప్పబడింది. భారతీయ కాలగణనంలో ఒక రోజు సూర్యోదయం నుండి మరుసటి రోజు సూర్యోదయం వరకు 60 ఘడియల కాలంగా విభజింపబడింది. ఇందులో 30 ఘడియలు పగలుగానూ, 30 ఘడియలు రాత్రిగానూ చెప్పబడింది. సూర్యోదయం నుండి 55 ఘడియలు అనంతరపు 5 ఘడియల కాలాన్ని ఉషఃకాలం అని, 57 ఘడియలు దాటిన తర్వాత, 3 ఘడియల కాలాన్ని అరుణోదయ కాలంగానూ, 58 ఘడియలు దాటిన తర్వాత 2 ఘడియల కాలాన్ని ప్రాతఃకాలమని అంటారు. ఇందులో 55వ ఘడియ నుండి 58వ ఘడియల మధ్యకాలం దైవ పూజకు అత్యుత్తమమైన సమయంగా పరిగణించబడింది.

శ్రీవారికి పూజ చేయాలని సంకల్పించిన భక్తుడు, తెల్లవారుఝామున లేచి స్నాన సంధ్యాదులు పూర్తి చేసుకుని, శుభ్రని వస్త్రములు ధరించి (పంచె, ఉత్తరీయం), వారి వారి సంప్రదాయం అనుసరించి నొసటన తిలకం, నామము, బొట్టు మొ॥ ధరించి, పూజకు అవసరమైన ద్రవ్యములన్నీ సిద్ధముగా ఉంచుకోవాలి.

**పూజా ద్రవ్యములు**

- తులసీ దళములు
- పుష్పములు/పూలదండలు
- తీర్థము (పరిశుభ్రమైన నీరు)

- ఎలకులు, లవంగాలు (పొడిచేసి కలిపినవి)
- అగరవత్తులు
- దీపారాధన సామాగ్రి
- గంట
- హారతి పళ్ళెం, కర్పూరం
- పంచపాత్ర, ఉద్ధరిణె,
- చందనం

పూజ ప్రారంభించే ముందు, పూజలో స్వామివారికి సమర్పించవలసిన ఉపచారముల గురించి వివరంగా తెలుసుకుందాం. 'ఉపచారములు' అంటే, స్వామివారిని ఒక విశిష్టమైన అతిథిగా భావించి, మనం భక్తి భావనతో, ప్రియంగా చేసే 'సపర్యలు' అని చెప్పవచ్చు. ఈ ఉపచారములు ఏ విధంగా చేయాలి, ఎన్ని రకముల ఉపచారములు వంటి వివరములు ఆగమశాస్త్రాల్లో తెలియజేయబడింది. వాటి గురించి తరువాత తెలుసుకుందాం. పూజకు సంబంధించిన ఉపచారాలు అన్నంతనే మనకు 'షోడశోపచారములు' అని గుర్తుకు వస్తుంది. శ్రీవారి పరమ భక్తాగ్రేసరుడైన, పద కవితా పితామహుడు శ్రీమాన్ తాళ్ళపాక అన్నమాచార్యులవారు, శ్రీవారి మీద 32వేల సంకీర్తనలను రచించి, గానం చేసి తరించాడు. వారి సంకీర్తనలలో ఒక దాంట్లో, శ్రీవారికి జరిగే షోడశోపచారముల ప్రస్తావన ఉన్నది. కనుక మనం నిత్యం గృహంలో శ్రీవారికి జరిపే పూజలో 16 రకాల ఉపచారములతో స్వామి వారిని అర్చించడం శ్రేష్ఠం.

**"షోడశ కళానిధికి షోడశోపచారములు**
**జాడతోడ నిచ్చలును సమర్పయామి"**

అన్నమయ్య రచించిన పై కీర్తనలో 16 రకాల ఉపచారముల గురించి ప్రస్తావన ఉంది.



(**గమనిక:** తిరుమలలో శ్రీవారికి జరిగే నిత్యార్చనలో 16 ఉపచారములు మాత్రమేగాక, మరెన్నో ఉపచారములతో సుదీర్ఘంగా జరుగుతుంది. కాని మనం గృహంలో చేసే నిత్యపూజావిధానం, లఘు పద్ధతిలో జరుగుతుంది.)

**షోడశ (16) ఉపచారములు**

**1. ఆవాహన :** స్వామివారిని ధ్యానశ్లోకములతో స్తుతించి, స్వామివారిని నామములతో కీర్తించి, మనం చేసే పూజ స్వీకరించడానికి బింబంలో/చిత్రపటంలో ఆహ్వానించుటయే 'ఆవాహన' అనబడును. శ్రీహరి, స్వచ్ఛమైన, నిష్కల్మషమైన భక్తికి సదా సంతుష్టుడై పిలిస్తే పలుకుతాడు. ఎలాగైతే మనం ఎండుకట్టెలలో నిప్పు రాజేయటానికి, వాటిని మధిస్తామో, అదే విధంగా ధ్యాన మధనము చేత విష్ణువును ప్రసన్నం చేసుకుని, మనం నిత్యం అర్చించే శ్రీవారి విగ్రహములో/చిత్రపటములో స్వామివారిని ఆవాహన చేయాలి.

**2. ఆసనము :** ఇక స్వామివారిని ఆవాహన చేసిన తర్వాత, ఒక చక్కటి ఆసనమును సమర్పించి మనం చేయబోయే పూజలను స్వీకరించమని భక్తితో ప్రార్థించడం.

**3. పాద్యం :** పాదముల ప్రక్షాళణకై తీర్థసమర్పణ.

**4. అర్ఘ్యం :** హస్తముల శుద్ధికై నీరు సమర్పించుట.

**5. ఆచమనం :** శ్రీవారికి స్వీకరించుటకై నీరు సమర్పించుట.

**6. స్నానం :** అభిషేకించుట.

**7. వస్త్రం :** వస్త్రములతో స్వామివారికి అలంకరణ చేయుట

**8. ఉపవీతం :** యజ్ఞోపవీతం సమర్పించుట

**9. భూషణం :** స్వామివారికి ఆభరణములు అలంకరించుట

**10. పుష్పము :** స్వామివారిని పుష్పములతో అలంకరించుట/అర్చించుట.

**11. గంధం :** స్వామివారికి గంధం సమర్పించుట.

**12. ధూపం :** అగరువత్తులు/సాంబ్రాణి వెలిగించి స్వామివారికి సమర్పించడం.

**13. దీపం :** నేతి దీపముతో స్వామివారికి హారతి సమర్పణ.

**14. నైవేద్యం :** శుద్ధాన్నం, పండ్లు, ఇతర ప్రసాదాలు మొ॥వి స్వామివారికి నివేదన చేయుట.

**15. ముఖవాసమ్ :** నైవేద్యం తరువాత తాంబూల సమర్పణ.

**16. ప్రణామము :** మనం చేసిన పూజలో తెలిసీ/తెలియక జరిగిన లోపాలను క్షమించమని ప్రార్థిస్తూ స్వామివారికి నమస్కరించుట.

## నిత్య పూజప్రారంభము

శ్రీవారికి నిత్యార్చన ప్రారంభించడానికి ముందు, పూజాగృహం తలుపులు తెరచి, స్వామివారిని చూస్తూ క్రింది మంత్రములతో నమస్కరిస్తూ ప్రార్థన చేయాలి.

**హరిః ఓం ॥**

**అతోదేవా అవన్తునో యతో విష్ణుర్విచక్రమే । పృథివ్యా స్సప్తధామభిః ॥**
**ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిధదే పదమ్ । సమూఢమస్య పాగ్ంసురే ॥**
**త్రీణిపదావిచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః । తతోధర్మాణి ధారయన్న్ ॥**
**విష్ణోః కర్మాణి పశ్యతయతో వ్రతాని పస్పశే । ఇన్ద్రస్యయుజ్యస్సఖా ॥**
**తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః । దివీవ చక్షు రాతతమ్ ॥**
**తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ం సస్సమిన్ధతే । విష్ణోర్యత్పరమం పదమ్ ॥**

**శ్రీ భూసమేత శ్రీనివాస స్వామినః ప్రణామం సమర్పయామి** అని శ్రీవారికి శ్రద్ధా భక్తులతో నమస్కరించాలి.



తరువాత పూజా మందిరంలో దీపములను క్రింది మంత్రముతో వెలిగించాలి.

**ఓం ఉద్దీప్యస్స్వ జాతవేదో పఘ్నం న్నిర్‌ఋతిం మమ ।**
**పశూగ్ంశ్చ మహ్యా మావహ జీవనన్ష్చ దిశోదశ ॥**

పూజా మందిరంలో శ్రీవారి విగ్రహములకు, చిత్రపటములకు క్రిందటి రోజు పూజలో సమర్పించినటువంటి పుష్పములు, మాలలు, తులసీ వంటి నిర్మాల్యములను "ఓం భూర్భువస్సువః ॥" అన్న మంత్రమును ఉచ్చరిస్తూ, తొలగించి, పూజ గది శుభ్రపరచాలి.

శ్రీవారికి నిత్యపూజను ప్రారంభించే ముందు ఆచమనం చేయాలి (ఒక గ్లాసులో నీరు, ఉద్దరిణె విడిగా ఉంచుకోవాలి)

ఎడమ చేతితో గ్లాసులోని తీర్థమును ఉద్ధరిణెతో, కుడిచేతిలో పోసుకుని

**ఓం కేశవాయస్వాహా ॥** అన్న మంత్రంతో నీరు త్రాగవలెను. అలాగే

**ఓం నారాయణాయ స్వాహా ॥**

**ఓం మాధవాయ స్వాహా ॥** అని మూడు మార్లు తీర్థమును స్వీకరించాలి తదుపరి.

**ఓం గోవిందాయ నమః ॥**

**ఓం విష్ణవే నమః ॥**

**ఓం మధుసుదనాయ నమః ॥**

**ఓం త్రివిక్రమాయ నమః ॥**

**ఓం వామనాయ నమః ॥**

**ఓం శ్రీధరాయ నమః ॥**

**ఓం హృషీకేశాయ నమః ॥**

**ఓం పద్మనాభాయ నమః ॥**

**ఓం దామోదరాయ నమః ॥**

అని కేశవాది ద్వాదశ నామములతో స్వామివారిని ప్రార్థించాలి. అనంతరం ప్రాణాయామం చేయాలి. ఎడమవైపు (నాసికారంధ్రంతో) గాలిని పీలుస్తూ, కుడి వైపు వదలాలి. ఇలా మూడు మార్లు ప్రాణాయామమును క్రింది మంత్రంతో ఆచరించాలి.

**ఓం భూః । ఓం భువః । ఓం సువః । ఓం మహః । ఓం జనః । ఓం తపః । ఓం సత్యమ్ । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । ఓమాపోజ్యోతీరసో అమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥**

వేద విహితంగా ప్రాణాయామం ఆచరించిన తర్వాత, మనం శ్రీవారికి నిర్వహించే నిత్యపూజకు సంకల్పం చేసుకోవాలి. ఏ పూజ అయిన సంకల్పం చేయకుండా ఆచరిస్తే నిష్ఫలమవుతుంది.

మహాసంకల్పం

**శుభాభ్యాం శుభే శోభనే అభ్యుదయ ముహూర్తే, శ్రీ గోవింద గోవింద గోవింద, అద్య శ్రీభగవతః మహాపురుషస్య, విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భారతవర్షే, భరతఖణ్డే, శకాబ్దే, మేరోః దక్షిణేపార్శ్వే, శ్రీవేంకటాచలక్షేత్రే, కాంచీప్రదేశే, తుండీరమండలే, శ్రీకృష్ణాకావేర్యోః మధ్యప్రదేశే, స్వగృహే, భగవద్భాగవతాచార్యాణాం సన్నిధౌ, అస్మిన్ వర్తమానే వ్యావహారిక చాంద్ర (సౌర) మానేన, శ్రీమత్... సంవత్సరే, ... అయనే, ... ఋతౌ, ... మాసే, ... పక్షే, ... తిథౌ, ... వాసర యుక్తాయాం, ... నక్షత్రయుక్తాయాం, శుభయోగ, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ, భగవదాజ్ఞయా,**



**భగవత్కైంకర్యరూపం, శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం, ... గోత్రోద్భవస్య, ... నామధేయస్య, సధర్మపత్న్యాః ... నామ్న్యాః, సుపుత్రకస్య, ... నామధేయస్య, సుపుత్రికా ... నామ్న్యాః**

**సహకుటుంబానాం క్షేమస్థైర్య, విజయ వీర్య, అభయ, ఆయురారోగ్య, అష్టైశ్వర్యానాం అభివృద్ధి సిద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం, రాజద్వారే రాజముఖే సర్వకార్య అనుకూల్య సిద్ధ్యర్థం, మమ గృహే మహాలక్ష్మీ స్థిరనివాస సిద్ధ్యర్థం, దేహాన్తే మోక్ష ప్రాప్త్యర్థం**

**అస్యదేవ దేవస్య భగవతోనారాయణస్య శ్రియః పతేపురుషోత్తమస్య, శ్రీభూమి నీళా సమేతస్య, శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకస్య, శేషాచలక్షేత్ర వాసినః, శ్రీశ్రీనివాస స్వామినః ప్రీత్యర్థం, ప్రాతఃకాలే నిత్యార్చనం కరిష్యే ॥**

అని శ్రీవారిని ప్రార్థిస్తూ మహాసంకల్పం చేసుకోవాలి. అనంతరం పూజ కొరకు సిద్ధం చేసిన ద్రవ్యములు, పాత్రలు మొ॥ వాటి మీద పంచపాత్రలోని తీర్థంతో, క్రింది మంత్రంతో ప్రోక్షించవలెను.

**శుచీవోహవ్యా మరుతశ్శుచీనాగ్ం శుచిగ్ం హినోమ్యధ్వరగ్ం శుచీభ్యః । ఋతేన సత్యమృతసాప ఆయన్ శుచి జన్మానశ్శుచయ పావకాః ॥**

ప్రార్థనా శ్లోకములు

గృహదేవతా నిత్యార్చనా ప్రారంభించటానికి ముందు, శ్రీవారి యందు మనస్సు లగ్నం చేసి, శ్రద్ధా భక్తులతో రెండు చేతులూ జోడించి, వినమ్రతతో స్వామివారికి నమస్కరిస్తూ, క్రింది ప్రార్థనా శ్లోకములను చదువవలెను.

**ఓం నిరుపమ గుణసిన్ధుర్నిత్యలక్ష్మీ సమేతో ।**
**నిఖిల నిగమ వేద్యో నిస్తులో వేంకటేశః ॥**

**నిజచరణ సమర్చాసక్త భక్తౌఘరక్షీ ।**
**నివసతు హృదయేమే స్వాంఘ్రి భక్తిన్వితన్వన్ ॥**

**ఓం అఖిల భువనజన్మస్థేమ భంగాదిలీలే ।**
**వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే ॥**
**శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే ।**
**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ॥**

**ఓం హైమోర్ధ్వపుండ్ర మజహన్మకుటం సునాసం ।**
**మందస్మితం మకరకుండల చారుగండం ॥**
**బింబాధరం బహుళ దీర్ఘ కృపాకటాక్షం ।**
**శ్రీవేంకటేశ ముఖమాత్మని సన్నిధత్తామ్ ॥**

**ఓం శ్రీ వేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసం ।**
**శ్రితచేతన మందారం శ్రీనివాసమహంభజే ॥**
**వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించనాత్ ।**
**వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి ॥**

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ॥**
**యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।**
**విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥**

**శ్రీ లక్ష్మీవల్లభారంభాం విఖనోముని మధ్యమామ్ ।**
**అస్మదాచార్య పర్యంతాం వన్దే గురుపరంపరామ్ ॥**
**శ్రౌతస్మార్తాదికం కర్మ నిఖిలం యేన సూత్రితమ్ ।**
**తస్మై సమస్త వేదార్థ విదే విఖనసేనమః ॥**

ప్రార్థన శ్లోకములు చదివి శ్రీవారికి నమస్కరించి, పంచపాత్రలో శుభ్రమైన నీరు నింపి, అందులో తీర్థ పరిమళం (ఏలకులు,



లవంగాలు+జాజికాయ, జాపత్రి కలిపి పొడి చేసుకుని శ్రీవారి ఆరాధనకు ఉపయోగించవచ్చు). కలిపి సిద్ధం చేసుకోవాలి. మరోక పాత్ర (ఖాళీగా), పంచపాత్ర పక్కనే వుంచాలి. దేవాలయాల్లో శ్రీవారి నిత్యారాధనకు అయిదు పాత్రలు ఉపయోగిస్తారు. ఇంట్లో జరిపే నిత్యపూజకు ఒక్కటే పాత్ర సరిపోతుంది. కానీ శ్రీవారికి విశేషంగా ఆరాధన చేయదలచినవారు, ఆలయంలో వలె 5 పాత్రలు ఉపయోగించి కూడా పూజ చేయవచ్చు.

## శ్రీవారి పూజా ప్రారంభం

**-షోడశోపచారములు**

**ఆవాహన :** పంచ పాత్రలలో (5 పాత్రలు లేక 1 పాత్ర) నీరు నింపి, తీర్థ పరిమళం వేయవలెను పరిమళం వేయుటకు అవకాశం లేనిచో తులసీదళములు వేయవలెను. ఉద్ధరిణెలో నీరు తీసుకుని, అందులో తులసీ దళముంచి, ఆ తులసీ దళముతో పంచపాత్రలలో ఆయాదేవతలను క్రింద చెప్పబడిన రీతిగా ఆవాహన చేయవలెను.

**స్నానపాత్రే వసిష్ఠమావాహయామి**
**అర్ఘ్యపాత్రే సోమమావాహయామి**
**పాద్యపాత్రే యజ్ఞాంగమావాహయామి**
**ఆచమన పాత్రే ఇందుమావాహయామి**
**మధ్యే శుద్ధతోయ పాత్రే చంద్రమావాహయామి**
**ధూపే బృహస్పతిమావాహయామి**
**దీపే శ్రియమావాహయామి**

(ఒక్క పాత్రే ఉపయోగించినప్పుడు, ఆవాహన చేయబడే దేవతలను అందులోనే ఆవాహన చేయవలెను)

**రయిః కకుద్మాన్ విదధద్విసష్టం రయిమద్విధానమ్**
**తస్మై కకుత్రే వికటాయ పిత్రే నమః ॥**

అనే మంత్రము చదివి

**ఓం శ్రీవేంకటేశమావాహయామి**
**అమృతస్వరూపమావాహయామి**
**విష్ణు మావాహయామి**
**సనాతనమావాహయామి**

అని శ్రీ వేంకటేశ్వరస్వామివారిని చిత్రపటము నందు/విగ్రహము నందు ఆవాహన చేయవలెను.

**ఆసనము**

**ఓం ప్రతద్విష్ణుతవతే వీర్యాయ ।**
**మృగోన భీమః కుచ రోగిరిష్ఠాః ।**
**యస్యో రుషుత్రిషు విక్రమణేషు ।**
**అధిక్షియన్తి భువనాని విశ్వా ॥**

**శ్రీశ్రీనివాస స్వామినః ఆసనం పరికల్పయామి ॥**
**(లక్ష్మీదేవి) శ్రియైనమః ఆసనం పరికల్పయామి ॥**
**(పద్మావతి) హరిణ్యైనమః ఆసనం పరికల్పయామి ॥**

పై మంత్రం చదివి శ్రీవారి పాదములు, హస్తముల యందు తులసీదళములు వుంచవలెను.

**పాద్యం**

**త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః ।**
**తతో ధర్మాణి ధారయన్ ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః పాద్యం సమర్పయామి ॥**
**శ్రియైనమః పాద్యం సమర్పయామి ॥**
**హరిణ్యైనమః పాద్యం సమర్పయామి ॥**



పై మంత్రం చదువుతూ ఉద్ధరిణెతో, పంచపాత్రలోని తీర్థము, స్వామివారి పాదములకు చూపించి, పతద్గ్రహ పాత్రలో విడువవలెను. ఇలా ఒక్కో పాదానికి 3 మార్లు, చేయవలెను. అలానే అమ్మవార్లు ఇరువురికీ పాద్యం సమర్పించవలెను.

**ఆచమనం**

**శంనోదేవీ రభిష్టయ ఆపోభవన్తు పీతయే ।**
**శం యో రభి స్రవన్తునః ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః ఆచమనీయం సమర్పయామి ॥**
**శ్రియైనమః ఆచమనీయం సమర్పయామి ॥**
**హరిణ్యైనమః ఆచమనీయం సమర్పయామి ॥**

పై మంత్రముతో శ్రీవారి చతుర్హస్తములకు 3 పర్యాయములు చొప్పున తీర్థంతో ఆచమనం ఇచ్చి పతద్గ్రహ పాత్రలో విడువవలెను. అట్లే అమ్మవార్లు లక్ష్మీ, పద్మావతీదేవిలకు ఆచమనం సమర్పించవలెను.

**స్నానం**

**ఇషేత్వోర్జేత్వా వాయవస్థో పాయవస్థ దేవోవస్సవితా ప్రాకృయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్నియా దేవభాగ మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా అయక్ష్మా మావస్తేన ఈ శత మాఘశగ్ం సోరుద్రస్య హేతిః పరివోవృణక్తు ధ్రువా అస్మిన్గోపతౌ స్యాత బహ్వీర్యజమానస్య పశూన్పాహి ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః శుద్ధోదకేన స్నాపయామి ॥**
**శ్రియైనమః శుద్ధోదకేన స్నాపయామి ॥**
**హరిణ్యైనమః శుద్ధోదకేన స్నాపయామి ॥**

పై మంత్రం చదువుతూ శ్రీవారి విగ్రహములకు పరిశుద్ధమైన జలంతో అభిషేకం చేయవలెను. (అభిషేకం సంపూర్ణంగా చేయుటకు వీలుకానిచో ఉద్దరిణెలో తీర్థం తీసుకుని, తులసీ దళములతో ఆ ఉద్దరిణెలోని తీర్థంతో స్వామివారి అర్చారూపం మీద పై మంత్రం చదివి ప్రోక్షణ చేయవలెను)

**వస్త్రం, ఉపవీతం, భూషణం**

**విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమేరజాగ్ంసి యో అస్కభాయ దుత్తరగ్ం సధస్థం విచక్రమాణస్త్రే ధోరుగాయో విష్ణోరరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోఃశ్నప్త్రేస్థో విష్ణోస్స్యూరసి విష్ణోఃర్ధువమసి వైష్ణవమసి విష్ణవేత్వా ॥**

**అగ్నిందూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్ ।**
**అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః వస్త్ర, ఉపవీత, భూషణం సమర్పయామి ॥**
**శ్రియైనమః వస్త్రాభరణై రలంకరోమి ॥**
**హరిణ్యైనమః వస్త్రాభరణై రలంకరోమి ॥**

పై మంత్రం చదివి, శ్రీవారికి నూతన పట్టు వస్త్రం, యజ్ఞోపవీతం, ఆభరణములు సమర్పించాలి. చిత్రపటమైనచో, పై మంత్రం చదివి, అక్షతలు, తులసి స్వామివారి పాదములకు సమర్పించవలెను. తర్వాత శ్రీవారికి పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం ముందు చెప్పబడిన విధంగా సమర్పించవలెను.

**పుష్పం**

**తద్విష్ణోః పరమం పదగ్ం సదాపశ్యన్తి సూరయః ।**
**దివీవ చక్షురాతతమ్ ॥**

పై మంత్రం చదివి, శ్రీవారి పాదములకు, అమ్మవార్ల పాదములకు పుష్పములు సమర్పించవలెను. అనంతరం, అవకాశాన్ని అనుసరించి,



శ్రీవారికి కేశవాది చతుర్వింశతి నామావళి, శ్రీ వేంకటేశ్వర అష్టోత్తరం/ సహస్రనామం పఠిస్తూ స్వామివారికి తులసీ దళములతో అర్చన చేయాలి. అర్చన అయిన తర్వాత అమ్మవార్లకు, వరాహ పురాణాంతర్గత శ్రీలక్ష్మీ చతుర్వింశతి నామావళితో అర్చన జరుపవలెను. (కేశవాది చతుర్వింశతి నామావళి అష్టోత్తరం, సహస్రనామం, లక్ష్మీ చతుర్వింశతి నామావళి అనుబంధంలో ఇవ్వబడినది). సమయాభావం, ఇతర కారణముల వలన ప్రతిరోజు అర్చనలో అష్టోత్తరం/సహస్రనామంతో చేయటానికి వీలుపడని సందర్భంలో కేశవాది చతుర్వింశతి నామావళి పఠించి, చివర్లో ఓం నమో వేంకటేశాయ శ్రీ వేంకటేశాయనమః ॥ అని ముగించవలెను. తర్వాత లక్ష్మీ చతుర్వింశతి నామావళి తో అమ్మవారికి అర్చన చేయాలి.

**గన్ధం**

**తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ంస స్సమింధతే ।**
**విష్ణోర్యత్పరమం పదమ్ ॥**

పై మంత్రం చదివి శ్రీవారికి గంధం సమర్పించవలెను.

**శ్రీ శ్రీనివాస స్వామినః దివ్య శ్రీచందనమాలేపయామి ॥**
**శ్రియైనమః దివ్య శ్రీచందనమాలేపయామి ॥**
**హరిణ్యైనమః దివ్య శ్రీచందనమాలేపయామి ॥**

**ధూపం**

**పరోమాత్రయా తనువావృధాన నతే మహిత్వ మన్వశ్నువన్తి ।**
**ఉభే తే విద్మరజసీ పృథివ్యా విష్ణో దేవత్వం పరమస్య విథ్సే ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః దివ్య ధూపమాఘ్రాపయామి ॥**
**శ్రీయైనమః దివ్య ధూపమాఘ్రాపయామి ॥**
**హరిణ్యైనమః దివ్య ధూపమాఘ్రాపయామి ॥**

పై మంత్రం చదివి శ్రీవారికి చక్కగా మూడుమార్లు ధూపం సమర్పించాలి. సమర్పించిన తర్వాత శ్రీవారికి అర్ఘ్యం క్రింది మంత్రం చదివి సమర్పించాలి.

**త్రిర్దేవః పృథివీ మేష ఏతాం విచక్రమే శతర్చసం మహిత్వా ।**
**ప్రవిష్ణురస్తు తవసస్తవీయాన్త్వేషగ్ం హ్యస్యస్థవిరస్య నామ ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః అర్ఘ్యం సమర్పయామి ॥**
**శ్రియైనమః అర్ఘ్యం సమర్పయామి ॥**
**హరిణ్యైనమః అర్ఘ్యం సమర్పయామి ॥**

దీపం

**విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే ఇన్ద్రస్య యుజ్యస్సఖా ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః దీపం దర్శయామి ॥**
**శ్రీయైనమః దీపం దర్శయామి ॥**
**హరిణ్యైనమః దీపం దర్శయామి ॥**

పై మంత్రం చదివి స్వామివారికి నేతి దీపంతో మూడుమార్లు హారతి ఇవ్వవలెను. హారతి సమర్పించునపుడు, మొదట శ్రీవారి పాదముల వద్ద ప్రారంభించి ప్రదక్షిణ క్రమములో శిరస్సు వరకు, మూడుమార్లు హారతి ఇవ్వవలెను.

అనంతరం శ్రీవారికి అర్ఘ్యం సమర్పించిన తర్వాత, మరల ఆచమనం సమర్పించవలెను.

నైవేద్యం

**తదస్య ప్రియమభిపాథో అశ్యాం నరో యత్ర దేవయవోమదన్తి ।**
**ఉరుక్రమస్య సహిబన్ధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః ॥**



**ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ।**
**ధియోయోనః ప్రచోదయాత్ ॥**

**అమృతమస్తు. అమృతో పస్మరణమసి.**

**ఊర్జస్కరం బలకరగ్ం సోమం మాద్యమ్ అన్నం అమృతాయ స్వాహా ।**

**ఓం ప్రాణాయ స్వాహా ।**
**ఓం అపానాయ స్వాహా ।**
**ఓం వ్యానాయ స్వాహా ।**
**ఓం ఉదానాయ స్వాహా ।**
**ఓం సమానాయ స్వాహా ।**

**శ్రీ శ్రీనివాస స్వామినః హవిర్నివేదయామి ॥**
**శ్రియైనమః హవిర్నివేదయామి ॥**
**హరిణ్యైనమః హవిర్నివేదయామి ॥**

పై మంత్రం చదివి, శుద్ధాన్నం మీద తులసీదళం, నెయ్యి వేసి తీర్థం ప్రోక్షణ చేసి శ్రీవారికి నైవేద్యాన్ని సమర్పించవలెను. పండ్లు నైవేద్యంగా సమర్పించినచో క్రింది మంత్రం చదవవలెను.

**నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి ।**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః ఫలోపహారం నివేదయామి ॥**
**శ్రీయైనమః ఫలోపహారం నివేదయామి ॥**
**హరిణ్యైనమః ఫలోపహారం నివేదయామి ॥**

**ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ ।**
**సమూఢమస్య పాగ్ం సురే ॥**

పై మంత్రం చదివి, శ్రీవారికి, అమ్మవార్లకు మూడుమార్లు పానీయం సమర్పించవలెను.

**శ్రీ శ్రీనివాస స్వామినః పానీయం దదామి ॥**
**శ్రియైనమః పానీయం దదామి ॥**
**హరిణ్యైనమః పానీయం దదామి ॥**

**ముఖవాసమ్**

**విచక్రమే పృథివీ మేష ఏతాం క్షేత్రాయ విష్ణుర్మనుషే దశస్యన్ ।**
**ధ్రువాసో అస్య కీరయోజనాసః ఉరుక్షితిగ్ం సుజని మాచకార ॥**

**శ్రీ శ్రీనివాస స్వామినః ముఖవాసం సమర్పయామి ॥**
**శ్రియైనమః ముఖవాసం సమర్పయామి ॥**
**హరిణ్యైనమః ముఖవాసం సమర్పయామి ॥**

"ముఖవాసం" అంటే తమలపాకులు, వక్కలు, ఏలకులు, లవంగాలు కలిపిన తాంబూల మిశ్రమం. నైవేద్యాన్ని సమర్పించిన తర్వాత, స్వామివార్కి పై మంత్రం చదివి ముఖవాసం సమర్పించవలెను.

**ప్రణామం**

**ఓం నమో వేంకటేశాయ ॥**
**ఓం నమో భగవతే వాసుదేవాయ ॥**
**ఓం నమో నారాయణాయ ॥**

పై అష్టాక్షరీ ద్వాదశాక్షరీలను చదివి స్వామివారి పాదముల యందు తులసీ, పుష్పములు సమర్పించి, శ్రద్ధా భక్తులతో శ్రీవారికి నమస్కరించాలి. అవకాశమున్నచో 'పురుష సూక్తం' కూడ పఠించవలయును.

**నీరాజనం**

అనంతరం శ్రీవారికి, క్రింది మంత్రముతో కర్పూర నీరాజనమును సమర్పించవలెను.

**సర్వప్రజాంమే గోపాయ అమృతత్వాయ జీవసే**
**జాతం జనిష్య మాణాంచ అమృతే సత్యే ప్రతిష్ఠితాం ॥**



శ్రీ భూ సమేత శ్రీశ్రీనివాసస్వామినః నీరాజనం దర్శయామి.

**క్షమా ప్రార్థన**

మనం చేసే నిత్యపూజలో తెలిసి, తెలియక మంత్రములలో, ద్రవ్యములలో, నియమములలో, క్రియలలో కాని జరిగిన తప్పులన్నింటినీ, క్షమించమని కోరుతూ శ్రీవారిని ప్రార్థించవలెను. ఎందుకంటే లోపము లేకుండా పూజలు చేయుట, బ్రహ్మదేవునికైనా అసాధ్యం అని మహర్షి భృగు వచనం.

**కాయేన వాచా మనసేంద్రియైర్వా**
**బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్ ।**
**కరోమి యద్యత్ సకలం పరస్మై**
**నారాయణాయేతి సమర్పయామి ॥**
**ఏతత్ సర్వం శ్రీ భూ నీళా సమేత శ్రీ శ్రీనివాసార్పణమస్తు ॥**

అని పై మంత్రము చదివి శ్రీ శ్రీనివాస భగవానుడికి నమస్కరించవలెను.

**తీర్థగ్రహణమ్**

పై విధంగా వేదప్రోక్తమైన పూజా విధానమును అనుసరించి శ్రీవేంకటేశ్వరస్వామి వారికి ఆరాధన జరిపిన తర్వాత, స్వామివారి తీర్థమును, క్రింది మంత్రంతో, 3 మార్లు స్వీకరించాలి.

**సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః**
**ఆజన్మకృత పాపానాం ప్రాయశ్చిత్తం దినే దినే ।**
**అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం**
**సర్వ పాపౌఘ శమనం శ్రీ శ్రీనివాసస్వామి పాదోదకం పావనం శుభం ॥**

**ఇతి తిరుమల దివ్యక్షేత్ర సంప్రదాయ అనుసరిత శ్రీవేంకటేశ్వర**
**నిత్య పూజా సంపూర్ణమ్ ॥**

శ్రీరస్తు

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రియై పద్మావత్యై నమః

శ్రీ బ్రహ్మాండపురాణే వసిష్ఠనారద సంవాదే శ్రీవేంకటాచలమాహాత్మ్యే

# శ్రీ వేంకటేశ సహస్రనామస్తోత్రమ్

**వసిష్ఠ ఉవాచ:**

భగవన్ కేన విధినా నామభిర్వేంకటేశ్వరమ్,
పూజయామాస తం దేవం బ్రహ్మా తు కమలైః శుభైః. 1

పృచ్ఛామి తాని నామాని గుణయోగపరాణి కిమ్,
ముఖ్యవృత్తీని కిం బ్రూహి లక్షకాణ్యథవా హరేః. 2

**నారద ఉవాచ:**

నామాన్యనంతాని హరేః గుణయోగాని కానిచిత్,
ముఖ్యవృత్తీని చాన్యాని లక్షకాణ్యపరాణి చ ॥ 3

పరమార్థైః సర్వశబ్దైరేకో జ్ఞేయః పరః పుమాన్,
ఆదిమధ్యాంతరహితస్త్వవ్యక్తోఽనంతరూపభృత్ ॥ 4

చంద్రార్కవహ్నివాయ్వాద్యా గ్రహర్క్షాణి నభో దిశః,
అన్వయవ్యతిరేకాభ్యాం సంతి నో సంతి యన్మతేః॥ 5

తస్య దేవస్య నామ్నాం హి పారం గంతుం హి కః క్షమః,
తథాఽపి చాభిధానాని వేంకటేశస్య కానిచిత్ ॥ 6

బ్రహ్మగీతాని పుణ్యాని తాని వక్ష్యామి సువ్రత!
యదుచ్చారణమాత్రేణ విముక్తాఘః పరం వ్రజేత్ ॥ 7



వేంకటేశస్య నామ్నాం హి సహస్రస్య ఋషిర్విధిః
ఛందోఽనుష్టుప్ తథా దేవః శ్రీవత్సాంకో రమాపతిః ॥ 8

బీజభూతస్తథోంకారో హ్రీం క్లీం శక్తిశ్చ కీలకమ్,
ఓం నమో వేంకటేశాయేత్యాదిర్మంత్రోఽత్ర కథ్యతే ॥ 9

బ్రహ్మాండగర్భః కవచమస్త్రం చక్రగదాధరః,
వినియోగోఽభీష్టసిద్ధౌ హృదయం సామగాయనః॥ 10

## ధ్యానమ్

భాస్వచ్చంద్రమసౌ యదీయనయనే భార్యా యదీయా రమా
యస్మాద్విశ్వసృడప్యభూద్యమికులం యద్ధ్యానయుక్తం సదా,
నాథో యో జగతాం నగేంద్రదుహితుర్నాథోఽపి యద్భక్తిమాన్
తాతో యో మదనస్య యో దురితహా తం వేంకటేశం భజే ॥

ఊర్ధ్వౌ హస్తౌ యదీయౌ సురరిపుదలనే బిభ్రతౌ శంఖచక్రే
సేవ్యావంఘ్రీ స్వకీయావభిదధదధరో దక్షిణో యస్య పాణిః,
తావన్మాత్రం భవాబ్ధిం గమయతి భజతామూరుగో వామపాణిః
శ్రీవత్సాంకశ్చ లక్ష్మీర్యదురసి లసతస్తం భజే వేంకటేశమ్॥

ఇతి ధ్యాయన్ వేంకటేశం శ్రీవత్సాంకం రమాపతిమ్,
వేంకటేశో విరూపాక్ష ఇత్యారభ్య జపేత్క్రమాత్ ॥

వేంకటేశో విరూపాక్షో విశ్వేశో విశ్వభావనః
విశ్వసృడ్విశ్వసంహర్తా విశ్వప్రాణో విరాడ్వపుః॥ 1

శేషాద్రినిలయోఽశేషభక్తదుఃఖప్రణాశనః,
శేషస్తుత్యశ్శేషశాయీ విశేషజ్ఞో విభుః స్వభూః॥ 2

విష్ణుర్జిష్ణుశ్చ వర్ధిష్ణురుత్సహిష్ణుస్సహిష్ణుకః
భ్రాజిష్ణుశ్చ గ్రసిష్ణుశ్చ వర్తిష్ణుశ్చ భరిష్ణుకః ॥ 3

కాలయంతా కాలగోప్తా కాలః కాలాంతకోఽఖిలః
కాలగమ్యః కాలకంఠవంద్యః కాలకలేశ్వరః॥ 4

శంభుః స్వయంభూరంభోజనాభిః స్తంభితవారిధిః,
అంభోధినందినీజానిః శోణాంభోజపదప్రభః॥ 5

కంబుగ్రీవః శంబరారిరూపః శంబరజేక్షణః
బింబాధరో బింబరూపీ ప్రతిబింబక్రియాతిగః ॥ 6

గుణవాన్ గుణగమ్యశ్చ గుణాతీతో గుణప్రియః,
దుర్గుణధ్వంసకృత్సర్వసుగుణో గుణభాసకః ॥ 7

పరేశః పరమాత్మా చ పరంజ్యోతిః పరా గతిః,
పరం పదం వియద్వాసాః పారంపర్యశుభప్రదః॥ 8

బ్రహ్మాండగర్భో బ్రహ్మణ్యో బ్రహ్మసృడ్ బ్రహ్మబోధితః,
బ్రహ్మస్తుత్యో బ్రహ్మవాదీ బ్రహ్మచర్యపరాయణః॥ 9

సత్యవ్రతార్థసంతుష్టః సత్యరూపీ ఝషాంగవాన్,
సోమకప్రాణహారీ చానీతామ్నాయోఽబ్ధిసంచరః॥ 10

దేవాసురవరస్తుత్యః పతన్మందరధారకః,
ధన్వంతరిః కచ్ఛపాంగః పయోనిధివిమంథకః ॥ 11

అమరామృతసంధాతా ధృతసంమోహినీవపుః
హరమోహకమాయావీ రక్షస్సందోహభంజనః. 12

హిరణ్యాక్షవిదారీ చ యజ్ఞో యజ్ఞవిభావనః,
యజ్ఞీయోర్వీసముద్ధర్తా లీలాక్రోడః ప్రతాపవాన్. 13

దండకాసురవిధ్వంసీ వక్రదంష్ట్రః క్షమాధరః,
గంధర్వశాపహరణః పుణ్యగంధో విచక్షణః॥ 14



కరాలవక్త్రః సోమార్కనేత్రః షడ్గుణవైభవః
శ్వేతఘోణీ ఘూర్ణితభ్రూర్ఘుర్ఘురధ్వనివిభ్రమః॥ 15

ద్రాఘీయాన్ నీలకేశీ చ జాగ్రదంబుజలోచనః,
ఘృణావాన్ ఘృణిసమ్మోహో మహాకాలాగ్నిదీధితిః॥ 16

జ్వాలాకరాలవదనో మహోల్కాకులవీక్షణః,
సటానిర్భిన్నమేఘౌఘో దంష్ట్రారుగ్వ్యాప్తదిక్తటః॥ 17

ఉచ్ఛ్వాసాకృష్టభూతేశో నిశ్శ్వాసత్యక్తవిశ్వసృట్,
అంతర్భ్రమజ్జగద్గర్భోఽనంతో బ్రహ్మకపాలహృత్॥ 18

ఉగ్రో వీరో మహావిష్ణు ర్జ్వలనః సర్వతోముఖః,
నృసింహో భీషణో భద్రో మృత్యుమృత్యుః సనాతనః ॥ 19

సభాస్తంభోద్భవో భీమః శిరోమాలీ మహేశ్వరః,
ద్వాదశాదిత్యచూడాలః కల్పధూమసటాచ్ఛవిః॥ 20

హిరణ్యకోరఃస్థలభిన్నఖః సింహముఖోఽనఘః,
ప్రహ్లాదవరదో ధీమాన్ భక్తసంఘప్రతిష్ఠితః॥ 21

బ్రహ్మరుద్రాదిసంసేవ్యః సిద్ధసాధ్యప్రపూజితః,
లక్ష్మీనృసింహో దేవేశో జ్వాలాజిహ్వాంత్రమాలికః ॥ 22

ఖడ్గీ ఖటీ మహేష్వాసీ కపాలీ ముసలీ హలీ,
పాశీ శూలీ మహాబాహుర్జ్వరఘ్నో రోగలుంఠకః॥ 23

మౌంజీయుక్ ఛాత్రకో దండీ కృష్ణాజినధరో వటుః,
అధీతవేదో వేదాంతోద్ధారకో బ్రహ్మనైష్ఠికః॥ 24

అహీనశయనప్రీతః ఆదితేయోఽనఘో హరిః,
సంవిత్ప్రియః సామవేద్యో బలివేశ్మప్రతిష్ఠితః॥ 25

బలిక్షాలితపాదాబ్జో వింధ్యావలివిమానితః
త్రిపాదభూమిస్వీకర్తా విశ్వరూపప్రదర్శకః ॥ 26

ధృతత్రివిక్రమః స్వాంఘ్రినఖభిన్నాండ(ఖ)కర్పరః,
పజ్జాతవాహినీధారాపవిత్రితజగత్త్రయః॥ 27

విధిసమ్మానితః పుణ్యో దైత్యయోద్ధా జయోర్జితః,
సురరాజ్యప్రదః శుక్రమదహృత్సుగతీశ్వరః॥ 28

జామదగ్న్యః కుఠారీ చ కార్తవీర్యవిదారణః
రేణుకాయాః శిరోహారీ దుష్టక్షత్రియమర్దనః॥ 29

వర్చస్వీ దానశీలశ్చ ధనుష్మాన్ బ్రహ్మవిత్తమః,
అత్యుదగ్రః సమగ్రశ్చ న్యగ్రోధో దుష్టనిగ్రహః॥ 30

రఘువంశసముద్భూతో రాఘవో భరతాగ్రజః,
కౌసల్యాతనయో రామో విశ్వామిత్రప్రియంకరః॥ 31

తాటకారిః సుబాహుఘ్నో బలాతిబలమంత్రవాన్,
అహల్యాశాపవిచ్ఛేదీ ప్రవిష్టజనకాలయః॥ 32

స్వయంవరసభాసంస్థ ఈశచాపప్రభంజనః,
జానకీపరిణేతా చ జనకాధీశసంస్తుతః ॥ 33

జమదగ్నితనూజాతయోద్ధాఽయోధ్యాధిపాగ్రణీః,
పితృవాక్యప్రతీపాలస్త్యక్తరాజ్యః సలక్ష్మణః॥ 34

ససీతశ్చిత్రకూటస్థో భరతాఽఽహితరాజ్యకః,
కాకదర్పప్రహర్తా చ దండకారణ్యవాసకః॥ 35

పంచవట్యాం విహారీ చ స్వధర్మపరిపోషకః,
విరాధహాఽగస్త్యముఖ్యమునిసమ్మానితః పుమాన్॥ 36



ఇంద్రచాపధరః ఖడ్గధరశ్చాక్షయసాయకః,
ఖరాంతకో దూషణారిస్త్రిశిరస్కరిపుర్వృషః॥ 37

తతః శూర్పణఖానాసాచ్ఛేత్తా వల్కలధారకః,
జటావాన్ పర్ణశాలాస్థో మారీచబలమర్దకః॥ 38

పక్షిరాట్కృతసంవాదో రవితేజా మహాబలః,
శబర్యానీతఫలభుక్ హనూమత్పరితోషితః॥ 39

సుగ్రీవాభయదో దైత్యకాయక్షేపణభాసురః,
సప్తతాలసముచ్ఛేత్తా వాలిహృత్కపిసంవృతః॥ 40

వాయుసూనుకృతాసేవస్త్యక్తపంపః కుశాసనః,
ఉదన్వత్తీరగః శూరో విభీషణవరప్రదః ॥ 41

సేతుకృద్దైత్యహా ప్రాప్తలంకోఽలంకారవాన్ స్వయమ్,
అతికాయశిరశ్ఛేత్తా కుంభకర్ణవిభేదనః ॥ 42

దశకంఠశిరోధ్వంసీ జాంబవత్ప్రముఖావృతః,
జానకీశః సురాధ్యక్షః సాకేతేశః పురాతనః ॥ 43

పుణ్యశ్లోకో వేదవేద్యః స్వామితీర్థనివాసకః,
లక్ష్మీసరఃకేలిలోలో లక్ష్మీశో లోకరక్షకః ॥ 44

దేవకీగర్భసంభూతో యశోదేక్షణలాలితః
వసుదేవకృతస్తోత్రో నందగోపమనోహరః॥ 45

చతుర్భుజః కోమలాంగో గదావాన్నీలకుంతలః
పూతనాప్రాణసంహర్తా తృణావర్తవినాశనః॥ 46

గర్గారోపితనామాంకో వాసుదేవో హ్యధోక్షజః,
గోపికాస్తన్యపాయీ చ బలభద్రానుజోఽచ్యుతః॥ 47

వైయాఘ్రనఖభూషశ్చ వత్సజిద్వత్సవర్ధనః,
క్షీరసారాశనరతో దధిభాండప్రమర్దనః ॥ 48

నవనీతాపహర్తా చ నీలనీరదభాసురః,
ఆభీరదృష్టదౌర్జన్యో నీలపద్మనిభాననః ॥ 49

మాతృదర్శితవిశ్వాఽఽస్య ఉలూఖలనిబంధనః,
నలకూబరశాపాంతో గోధూలిచ్ఛురితాంగకః॥ 50

గోసంఘరక్షకః శ్రీశో బృందారణ్యనివాసకః,
వత్సాంతకో బకద్వేషీ దైత్యాంబుదమహానిలః॥ 51

మహాజగరచండాగ్నిః శకటప్రాణకంటకః,
ఇంద్రసేవ్యః పుణ్యగాత్రః ఖరజిచ్చండదీధితిః॥ 52

తాలపక్వఫలాశీ చ కాలీయఫణిదర్పహా,
నాగపత్నీస్తుతిప్రీతః ప్రలంబాసురఖండనః॥ 53

దావాగ్నిబలసంహారీ ఫలహారీ గదాగ్రజః,
గోపాంగనాచేలచోరః పాథోలీలావిశారదః॥ 54

వంశగానప్రవీణశ్చ గోపీహస్తాంబుజార్చితః,
మునిపత్న్యాహృతాహారో మునిశ్రేష్ఠో మునిప్రియః॥ 55

గోవర్ధనాద్రిసంధర్తా సంక్రందనతమోఽపహః,
సదుద్యానవిలాసీ చ రాసక్రీడాపరాయణః॥ 56

వరుణాభ్యర్చితో గోపీప్రార్థితః పురుషోత్తమః,
అక్రూరస్తుతిసంప్రీతః కుబ్జాయౌవనదాయకః ॥ 57

ముష్టికోరఃప్రహారీ చ చాణూరోదరదారణః,
మల్లయుద్ధాగ్రగణ్యశ్చ పితృబంధనమోచకః॥ 58



మత్తమాతంగపంచాస్యః కంసగ్రీవానికృంతనః
ఉగ్రసేనప్రతిష్ఠాతా రత్నసింహాసనస్థితః॥ 59

కాలనేమిఖలద్వేషీ ముచుకుందవరప్రదః,
సాల్వసేవితదుర్ధర్షరాజస్మయనివారణః॥ 60

రుక్మిగర్వాపహారీ చ రుక్మిణీనయనోత్సవః,
ప్రద్యుమ్నజనకః కామీ ప్రద్యుమ్నో ద్వారకాధిపః॥ 61

మణ్యాహర్తా మహామాయో జాంబవత్కృతసంగరః,
జాంబూనదాంబరధరో గమ్యో జాంబవతీవిభుః॥ 62

కాలిందీప్రథితారామకేలిర్గుంజావతంసకః,
మందారసుమనోభాస్వాన్ శచీశాభీష్టదాయకః॥ 63

సత్రాజిన్మానసోల్లాసీ సత్యాజానిః శుభావహః,
శతధన్వహరః సిద్ధః పాండవప్రియకోత్సవః॥ 64

భద్రప్రియః సుభద్రాయా భ్రాతా నాగ్నజితీవిభుః
కిరీటకుండలధరః కల్పపల్లవలాలితః॥ 65

భైష్మీప్రణయభాషావాన్ మిత్రవిందాధిపోఽభయః,
స్వమూర్తికేలిసంప్రీతో లక్ష్మణోదారమానసః॥ 66

ప్రాగ్జ్యోతిషాధిపధ్వంసీ తత్సైన్యాంతకరోఽమృతః,
భూమిస్తుతో భూరిభోగో భూషణాంబరసంయుతః ॥ 67

బహురామాకృతాహ్లాదో గంధమాల్యానులేపనః,
నారదాదృష్టచరితో దేవేశో విశ్వరాడ్గురుః॥ 68

బాణబాహువిదారశ్చ తాపజ్వరవినాశకః,
ఉషోద్ధర్షయితాఽవ్యక్తః శివవాక్తుష్టమానసః ॥ 69

మహేశజ్వరసంస్తుత్యః శీతజ్వరభయాంతకః,
నృగరాజోద్ధారకశ్చ పౌండ్రకాదివధోద్యతః॥ 70

వివిధారిచ్ఛలోద్విగ్నబ్రాహ్మణేషు దయాపరః,
జరాసంధబలద్వేషీ కేశిదైత్యభయంకరః॥ 71

చక్రీ చైద్యాంతకః సభ్యో రాజబంధవిమోచకః,
రాజసూయహవిర్భోక్తా స్నిగ్ధాంగః శుభలక్షణః॥ 72

ధానాభక్షణసంప్రీతః కుచేలాభీష్టదాయకః,
సత్త్వాదిగుణగంభీరో ద్రౌపదీమానరక్షకః॥ 73

భీష్మధ్యేయో భక్తవశ్యో భీమపూజ్యో దయానిధిః,
దంతవక్త్రశిరశ్ఛేత్తా కృష్ణః కృష్ణాసఖః స్వరాట్ ॥ 74

వైజయంతీప్రమోదీ చ బర్హిబర్హవిభూషణః,
పార్థకౌరవసంధానకారీ దుశ్శాసనాంతకః॥ 75

బుద్ధో విశుద్ధః సర్వజ్ఞః క్రతుహింసావినిందకః,
త్రిపురస్త్రీమానభంగః సర్వశాస్త్రవిశారదః॥ 76

నిర్వికారో నిర్మమశ్చ నిరాభాసో నిరామయః,
జగన్మోహకధర్మీ చ దిగ్వస్త్రో దిక్పతీశ్వరః॥ 77

కల్కీ మ్లేచ్ఛప్రహర్తా చ దుష్టనిగ్రహకారకః,
ధర్మప్రతిష్ఠాకారీ చ చాతుర్వర్ణ్యవిభాగకృత్ ॥ 78

యుగాంతకో యుగాక్రాంతో యుగకృద్యుగభాసకః,
కామారిః కామకారీ చ నిష్కామః కామితార్థదః॥ 79

భర్గో వరేణ్యః సవితుః శార్ఙ్గీ వైకుంఠమందిరః
హయగ్రీవః కైటభారిః గ్రాహఘ్నో గజరక్షకః॥ 80



సర్వసంశయవిచ్ఛేత్తా సర్వభక్తసముత్సుకః
కపర్దీ కామహారీ చ కలా కాష్ఠా స్మృతిర్ధృతిః॥ 81

అనాదిరప్రమేయౌజాః ప్రధానః సన్నిరూపకః,
నిర్లేపో నిఃస్పృహోఽసంగో నిర్భయో నీతిపారగః॥ 82

నిష్ప్రేష్యో నిష్క్రియః శాంతో నిష్ప్రపంచో నిధిర్నయః,
కర్మ్యకర్మీ వికర్మీ చ కర్మేప్సుః కర్మభావనః॥ 83

కర్మాంగః కర్మవిన్యాసో మహాకర్మీ మహావ్రతీ,
కర్మభుక్కర్మఫలదః కర్మేశః కర్మనిగ్రహః॥ 84

నరో నారాయణో దాంతః కపిలః కామదః శుచిః,
తప్తా జప్తాఽక్షమాలావాన్ గంతా నేతా లయో గతిః॥ 85

శిష్టో ద్రష్టా రిపుద్వేష్టా రోష్టా వేష్టా మహానటః,
రోద్ధా బోద్ధా మహాయోద్ధా శ్రద్ధావాన్ సత్యధీః శుభః॥ 86

మంత్రీ మంత్రో మంత్రగమ్యో మంత్రకృత్పరమంత్రహృత్,
మంత్రభృన్మంత్రఫలదో మంత్రేశో మంత్రవిగ్రహః॥ 87

మంత్రాంగో మంత్రవిన్యాసో మహామంత్రో మహాక్రమః,
స్థిరధీః స్థిరవిజ్ఞానః స్థిరప్రజ్ఞః స్థిరాసనః॥ 88

స్థిరయోగః స్థిరాధారః స్థిరమార్గః స్థిరాగమః
నిశ్శ్రేయసో నిరీహోఽగ్నిర్నిరవద్యో నిరంజనః॥ 89

నిర్వైరో నిరహంకారో నిర్దంభో నిరసూయకః,
అనంతోఽనంతబాహూరురనంతాంఘ్రిరనంతదృక్ ॥ 90

అనంతవక్త్రోఽనంతాంగోఽనంతరూపో హ్యనంతకృత్,
ఊర్ధ్వరేతా ఊర్ధ్వలింగో హ్యూర్ధ్వమూర్ధోర్ధ్వశాఖకః॥ 91

ఊర్ధ్వ ఊర్ధ్వాధ్వరక్షీ చ హ్యూర్ధ్వజ్వాలో నిరాకులః,
బీజం బీజప్రదో నిత్యో నిదానం నిష్కృతిః కృతీ॥ 92

మహానణీయాన్ గరిమా సుషమా చిత్రమాలికః,
నభస్స్పృఙ్నభసో జ్యోతిర్నభస్వాన్నిర్నభా నభః॥రీ 93

అభుర్విభుః ప్రభుః శంభుర్మహీయాన్ భూర్భువాకృతిః,
మహానందో మహాశూరో మహోరాశిర్మహోత్సవః॥ 94

మహాక్రోధో మహాజ్వాలో మహాశాంతో మహాగుణః
సత్యవ్రతః సత్యపరః సత్యసంధః సతాం గతిః ॥ 95

సత్యేశః సత్యసంకల్పః సత్యచారిత్రలక్షణః,
అంతశ్చరో హ్యంతరాత్మా పరమాత్మా చిదాత్మకః ॥ 96

రోచనో రోచమానశ్చ సాక్షీ శౌరిర్జనార్దనః
ముకుందో నందనిష్పందః స్వర్ణబిందుః పురందరః॥ 97

అరిందమః సుమందశ్చ కుందమందారహాసవాన్,
స్యందనారూఢచండాంగో హ్యానందీ నందనందనః ॥ 98

అనసూయానందనోఽత్రినేత్రానందః సునందవాన్,
శంఖవాన్పంకజకరః కుంకుమాంకో జయాంకుశః ॥ 99

అంభోజమకరందాఢ్యో నిష్పంకోఽగరుపంకిలః,
ఇంద్రశ్చంద్రరథశ్చంద్రోఽతిచంద్రశ్చంద్రభాసకః॥ 100

ఉపేంద్ర ఇంద్రరాజశ్చ వాగింద్రశ్చంద్రలోచనః,
ప్రత్యక్ పరాక్ పరంధామ పరమార్థః పరాత్పరః ॥ 101

అపారవాక్ పారగామీ పారావారః పరావరః,
సహస్వానర్థదాతా చ సహనః సాహసీ జయీ॥ 102



తేజస్వీ వాయువిశిఖీ తపస్వీ తాపసోత్తమః,
ఐశ్వర్యోద్భూతికృద్భూతిరైశ్వర్యాంగకలాపవాన్ ॥ 103

అంభోధిశాయీ భగవాన్ సర్వజ్ఞః స్సామపారగః,
మహాయోగీ మహాధీరో మహాభోగీ మహాప్రభుః॥ 104

మహావీరో మహాతుష్టిర్మహాపుష్టిర్మహాగుణః,
మహాదేవో మహాబాహుర్మహాధర్మో మహేశ్వరః॥ 105

సమీపగో దూరగామీ స్వర్గమార్గనిరర్గలః,
నగో నగధరో నాగో నాగేశో నాగపాలకః॥ 106

హిరణ్మయః స్వర్ణరేతా హిరణ్యార్చిర్హిరణ్యదః,
గుణగణ్యః శరణ్యశ్చ పుణ్యకీర్తిః పురాణగః॥ 107

జన్యభృజ్జన్యసన్నద్ధో దివ్యపంచాయుధో వశీ,
దౌర్జన్యభంగః పర్జన్యః సౌజన్యనిలయో లయః॥ 108

జలంధరాంతకో భస్మదైత్యనాశీ మహామనాః,
శ్రేష్ఠః శ్రవిష్ఠో ద్రాఘిష్ఠో గరిష్ఠో గరుడధ్వజః॥ 109

జ్యేష్ఠో ద్రఢిష్ఠో వర్షిష్ఠో ద్రాఘీయాన్ ప్రణవః ఫణీ,
సంప్రదాయకరః స్వామీ సురేశో మాధవో మధుః॥ 110

నిర్నిమేషో విధిర్వేధా బలవాన్ జీవనం బలీ,
స్మర్తా శ్రోతా వికర్తా చ ధ్యాతా నేతా సమోఽసమః॥ 111

హోతా పోతా మహావక్తా రంతా మంతా ఖలాంతకః,
దాతా గ్రాహయితా మాతా నియంతాఽనంతవైభవః ॥ 112

గోప్తా గోపయితా హంతా ధర్మజాగరితా ధవః,
కర్తా క్షేత్రకరః క్షేత్రప్రదః క్షేత్రజ్ఞ ఆత్మవిత్ ॥ 113

